ఉపాసనాతత్త్వ గ్రంథమాల, ద్వితీయపుష్పము

# మూర్త్యర్చనాతత్త్వము

## (Philosophy of Hindu idol worship)





రచయిత:

గరిమెళ్ళ వీరరాఘవులు,

రామారావుపేట, కాకినాడ.

# కృతజ్ఞత

నాకు పరమ మిత్రులు, బంధువులు, పరోపకార పారీణులును, వదాన్యశేఖరులును కౌశికస గోత్రులును, శ్రీ దేవులపల్లి జానకిరామయ్యగారి పౌత్రులును, శ్రీ సూర్యనారాయణ మూర్తిగారి పుత్రులును, ద్రాక్షారామ అనాది పవిత్ర క్షేత్రమున వెలసియున్న శ్రీ మాణిక్యాంబా భీమేశ్వర భక్త పరతంత్రులును అగు శ్రీ దేవులపల్లి వెంకట సుబ్బారావుగారు నాచే రచింపబడిన గ్రంథములను చూచి, ఆ గ్రంథములు వదాన్యశేఖరు లొక్కొక్క పేరుతో ప్రకటింపబడి లోకోపకారకములు కానున్నవని వినినంతనే తమంత తాము ఈ గ్రంథము నచ్చువేయించుట కగు వ్యయమునంతను తాము భరింతుమని వాగ్దత్తము చేసి ఒక నెల అయినను కాకముందే, ముద్రణ ప్రారంభించకముందే, తమ వాగ్దానమును నిల్పుకొనుచు, తిరిగి జ్ఞాపకమునైనను చేయనవసరము లేకుండగనే ముద్రణావ్యయమునంతను నా కొసంగినందుల కెంతయు కృతజ్ఞుడను. వారి నెట్లు స్తుతింపవలెనో తెలియకున్నది. శ్రీ ద్రాక్షారామ భీమేశ్వరాలయ శిథిల ప్రదక్షిణ మండపాదుల పునరుద్ధరణకు భూరి విరాళము నొసంగియు అందరివలె తమ నామధేయము నా పునరుద్ధరణ భాగముపై చెక్కించుకొనుటకుకూడ ఇష్టపడని గుప్తదాతలు వీరు. వారి ఫొటో నీ గ్రంథమున

ముద్రింపింతునని ఎంత వేడినను అంగీకరించక, తుద కెట్లో
నా బలవంతముచే ఈ కృతజ్ఞతా ప్రకటనకుమాత్ర మంగీక
రించిరి. సర్వకారణుడా భగవంతుడేయని వారి విశ్వాసము.
త్రిలిఙ్గాధినాథుడగు మాణిక్యాంబా సహిత భీమేశ్వరుడు వారికి
సమస్తైశ్వర్యములను సుఖశాంతులను ఇచ్చి బ్రహ్మజ్ఞానము
ద్వారా తరింపజేయుగాక.

రామారావుపేట
కాకినాడ
8-7-1970

ఇట్లు, విధేయుడు
గరిమెళ్ల వీరరాఘవులు
గ్రంథకర్త.

# విషయసూచిక







# పీఠిక

శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులుగారు, M. A.
వ్యాకరణ విద్యాప్రవీణ, భాషాప్రవీణ
సంస్కృత ప్రధానోపన్యాసకులు
గవర్నమెంటు పిఠాపురం మహారాజా కళాశాల
కాకినాడ.

సర్వ జగత్కారణభూతమగు పరబ్రహ్మ ముపాస్యమని ఉపనిషత్తులు ప్రతిపాదించుచున్నవి. "కారణంతు ధ్యేయం" అని పెద్దలు చెప్పుదురు. ఆ కారణవస్తువు పర-వ్యూహ-విభవ-అర్చ-అంతర్యామి-రూపమున నైదువిధములై యున్నది. అంతటను నిర్వికారమైయున్నను, సాకారమై, సగుణమై, ఇంద్రియగోచరమై, సుఖారాధ్యమైయుండు అర్చామూర్తి మిగిలినవానికంటె ఉపాసనకు సులభోపాస్యమై, సర్వగుణపరిపూర్ణమైయుండును. షాడ్గుణ్యము అర్చామూర్తియందు పూర్ణముగా నుండునని ఆగమములు చెప్పుచున్నవి. వ్యూహవిభవములకంటె పరాఽర్చాంతర్యాములు అధికగుణ పరిపూర్ణములు. అందు పరము అవ్యక్తమై ఉపాసనకు దుర్గమమైయుండును. అంతర్యామి యుపాసనము సమాధినిష్ఠులకుదప్ప సర్వసులభము కాదు. కావున పరిపూర్తియుండి సులభమైన మూర్తి 'అర్చ' అని వేదవేత్తలందరు దానినే ఉపాసించి తరించిరి. ఇది తెలియనివారు అర్చారాధనము ప్రాథమికులకై కల్పితమనియు,

దేవాలయములు ఉపాధులకై యేర్పడినవనియు భ్రమించు చుందురు. అర్చామూర్తులు భక్తులతో ప్రత్యక్షముగ మాట లాడుట, వారి యోగక్షేమములను వహించుట అనేక చరిత్ర లలో స్పష్టముగా గోచరించును. బ్రహ్మోపాసనచే తరించు టయే విగ్రహారాధనచే తరించుట. విగ్రహోపాసన బ్రహ్మో పాసనమునకు విరుద్ధము కాదు. ఆ మూర్తియందు బ్రహ్మ ధ్యానమునే సాధకుడు చేయును. దానినే యనుభవించును. ఆ దేవతామూర్తులు కాల్పనికములు కావు. వేదచోదితములు. ఏయే దేవతామూర్తి ఏరూపమున నుండునో వేదములలో కలదని, దేవతలు విగ్రహము కలవారనియు బ్రహ్మసూత్రము లందు స్పష్టముగ గోచరించుచున్నది.

అట్టి విగ్రహములను గృహములం దారాధించి తరించు సాధకు లెందరో గలరు. కాని మన సిద్ధాంతమున ఎవ రేది చేసినను అది సర్వసుఖావహము కావలెననునదే మన లక్ష్యము. అందుచే విగ్రహములకు దేశ- రాష్ట్ర- పుర- గ్రామాది క్షేమ సంపాదనకై ఆలయముల నిర్మించి అర్చనా విధానమును ప్రతిపాదించిరి. దీనిని నిరూపించు శాస్త్రములు ఆగమములు. వానియందు దేవాలయ నిర్మాణమున, తద్రూప కల్పనమున, విగ్రహ ప్రతిష్ఠాపనమున ఎన్నో రహస్యములు ఇమడ్పఁబడియున్నవి. మన అధ్యాత్మవిద్య నిత్యజీవితముతో మేళవింపఁబడియుండును. మనము చేయు ప్రతి కార్యమునం దును, విద్యయందును, కళయందును, కావ్యమందును, శాస్త్ర

మందును ఆధ్యాత్మికత అంతర్లీనమై సాగుచునేయుండును. పైని చూడ సుందరముగ నాకర్షించి లోచూపు గలవారికి సత్యమై, శివప్రదమై విరాజిల్లునట్లు వెల్గొందఁజేయుటయే మన నిర్మాణ లక్ష్యము. మన శరీర నిర్మాణము, కాలముకూడ ఆ యాధ్యాత్మికతను సూచించుచున్నవిగనే యున్నవి. అట్టి తత్త్వప్రతిపాదకముగనే దేవాలయ నిర్మాణమును సాగినది. ఇది చూచువారికి శిల్పవిన్యాససుందరమై మనోహరముగనుండును. భావించువారికి సృష్టి తత్త్వ ప్రపంచన సమర్థమై యుండును. అన్వేషించువారికి గుహాంతర్వర్తి పరమార్థ దర్శనము నొసంగును. బిందువునుండి ఆవిర్భవించిన సృష్టి పంచభూతాత్మిక వ్యష్టి సృష్టివరకు విరివినొంది మరల నవ్యక్తమం దెట్లు లయము నందునో దేవాలయమున ఆ చూపు గలవారికి గాన్పించును. శరీరము ఎట్లు నిర్మింపఁబడినదో దేవాలయ మట్లు నిర్మింపబడినది. దీని యంగములే దాని యంగములు. హృదయగుహాంతర్వర్తి దహరాకాశస్థిత పరమాత్మోపాసనమే! దేవాలయ విమానాంతర్వర్తి గర్భాలయస్థిత అర్చావిగ్రహోపాసనము. కాలమున కెన్ని యవయవములు కలవో అన్ని యవయవములు దేవాలయమున గాన్పించును. ఇట్లు భావించిన, ఒక్క విగ్రహారాధనచే పరోపాసన, వ్యూహోపాసన, విభవోపాసన, అంతర్యామ్యుపాసనకూడ చేసినట్లగుచున్నది. దేవాలయమున ఆ రజఃపరుడగు, తమఃపరుడగు, కారణస్వరూపుని, సచ్ఛబ్ద వాచ్యుని భావింతురు. సంకర్షణాది వ్యూహమూర్తులు ఇందు

ఆవహింపఁబడును. విభవావతారమూర్తులు ఆయా రూపముల ఆలయములందు ప్రతిష్ఠితములై యుండును. సమ్యగ్భావనచే నిది యంతర్యామి భావనయే కాగలదు. ఇట్లైదువిధములుగ నుండు పరమాత్మోపాసనమే విగ్రహోపాసనము. కాని బొమ్మలపూజ కాదు.

ఇక నిర్మించిన దేవాలయమో అనాదియగు వేదవాఙ్మయము మొదలు నేటివఱకు సాగుచుండిన సర్వశాస్త్ర కళా సమాహారము. అందుపనిషత్ప్రతిపాదితములగు రహస్యములిమిడియున్నవి. సాంఖ్యాది సర్వశాస్త్రములు నందున్నవి. వాస్తుశాస్త్ర నిధానమే దేవాలయము. సర్వకళలకు నది కూడలి. ఇట్లా నిర్మాణములో ఒక ప్రత్యేకత కలదు. విమాననిర్మాణము, మండపనిర్మాణము, స్తంభనిర్మాణము, కుండికానిర్మాణము, మున్నగునవి ప్రత్యేక రహస్యార్థబోధకములయ్యు సౌందర్య సమన్వితములై ఆనందప్రదములై యొప్పుచున్నవి. ఎట్లు ఋషులు చేయు తపోయజ్ఞాదులు వారికే కాక సర్వప్రజాశ్రేయస్కరములో అట్లే దేవాలయములు సర్వప్రజాశ్రేయస్కరములు. ఇందు ప్రతిష్ఠింపబడిన దేవతామూర్తులుకూడ వైష్ణములేకానిండు, శైవములేకానిండు, శాక్తములేకానిండు ఒక్కొక్కరహస్యమును మనకు వెల్లడించునవై వాని నుపాసించుటచే మనకోర్కెసిద్ధిని ప్రసాదించునవై యున్నవి. ఆయా విగ్రహములు మూర్తుల తత్త్వములు గ్రంథమున చూచిన పాఠకులు గ్రహింపగల్గుదురు. అధ్యా

త్మికముగా కాక లౌకికముగా కూడ దేవాలయములు మన సమాజమున కత్యావశ్యకములు. అవి మనలో అనేకత్వములో నేకత్వమును సాధించు సాధనములు. అచట మన తరతమ భేదము లంతరించును. ఔపాధిక భేదమును విస్మరించి అందరము కూడియున్నను ఆలయమున నద్వైతమునే యనుభవింతుము. అది యనుభవైకవేద్యము.

ఇట్లు రహస్యార్థప్రతిపాదకములై సర్వసులభములై సర్వార్థప్రదములై విరాజిల్లు దేవాలయములు, విగ్రహారాధనము నేడు మనకెందుకో తెలియక పాశ్చాత్యవాసనాదూషితులమగుటచే కొంబోలు-అసారతాబుద్ధి కల్గుచున్నది. జ్ఞానము ప్రధానము కాని విగ్రహారాధనమెందుకని కొందరు, హృదయమున నారాధింపవలెనే కాని దేవాలయమెందుకని కొందరు విగ్రహారాధనచే సాధకుడు పరాకాష్ఠ నందలేడని కొందరు, వెర్రి వెర్రి యుక్తులు చెప్పి మనలో విశ్వాసమును సడలింపం జేయుచున్నారు. ఇట్లు మిథ్యాజ్ఞాన, సంశయజ్ఞాన, విపరీతజ్ఞానములు కలిగినరోజులలో కుతర్కవిలసితులగు మానవులకు కనువిప్పు కలిగించుటకు 'దేవాలయములు—విగ్రహారాధనము' అను విషయమున మహోత్కృష్టమగు విషయమునందిచ్చిన ఈ గ్రంథము ఎంత యుపకారము చేయగలదో చెప్పనలవిగాదు. ఇందు పరామర్శింపబడినవి ఒకశాస్త్రమునకు సంబంధించిన విషయములు కావు. తత్త్వశాస్త్రము, శాక్తము ఆగమములు, (వైఖానస, పాంచరాత్ర, శైవ, శాక్తాదులు) స్థాప

త్యము, శిల్పశాస్త్రము దర్శనములు, భూగర్భపరిశోధన, మున్నగున వెన్నియో తరచిచూచినగాని ఈవిషయము లింతగా ప్రవచించుట కష్టమని చదివి చూచినవారికి గోచరింపఁగలవు. ఎంతో కాలము ఎంతో శ్రమపడి ఆస్తిక్యముతో, ధర్మశ్రద్ధతో ఇదే తమ జీవితలక్ష్యముగా పరిశీలించి గ్రంథరూపమున సంతరించిన శ్రీ గరిమెళ్ళ వీరరాఘవులుగారు కడు ధన్యులు, ప్రశంసనీయులును. కాని ఒక్కటి విచారము-ఇంత మహత్తరమైన గ్రంథము ఆంధ్రజాతి యందుకొని చదువగలదో లేదో యని.

కాని ఒక్క ధైర్యము. ఈచిన్న వ్యాసములకు మూలమగు బృహద్గ్రంథము శ్రీ శ్రీ జగద్గురు శ్రీ కాంచి కామకోటి పీఠాధిపతులగు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామివారి కృపాపాత్రమైనదని. జగన్మాతృస్వరూపులగు దివ్యశ్రీచరణుల కృపాప్రాభవమున నా బృహద్గ్రంథము అచిరకాలముననే ఆంధ్రజాతి కందగలదు. కాని యంతవరకు చిన్నతడినైన ఒసంగి మనలను పేదదేర్పవలెనని యీ చిన్నవ్యాసములను సంతరించి ప్రకటింపజేయవలెనను నుదారాశయముతో నారాటపడుచున్న శ్రీ వీరరాఘవులుగారి ఔదార్యమునకు ఇవే నా నమోవాకములు.

నాకీవిషయమున అర్హతలేదని తెలియును నేనీమాటలు వ్రాయనర్హుడను కానని యెరుగుదును కాని యీ వాక్యములు విన్నప్పుడు కలిగిన యానందము నాపుకొనలేక

ఏవో కొన్నిపలుకులను పలికిన నా యీ దుస్సాహసమును పెద్దలు మన్నింతురుగాక! శ్రీ వీరరాఘవులుగారికి ఆయురారోగ్యైశ్వర్యములను, వారు రచించిన గ్రంథమునకు ఆచంద్ర తారార్క శాశ్వతత్వమును శ్రీ శ్రీనివాసుడు కటాక్షించుగాక

కాకినాడ }
19-4-'68 }

ఇట్లు, సుజనవిధేయుడు
శ్రీభాష్యం అప్పలాచార్యులు.

---

## గ్రంథమునుగూర్చి పండితాభిప్రాయములు

ఆర్షవిద్యాభూషణ శ్రీ జటావల్లభుల పురుషోత్తము, M·A· గారు
ఆంధ్రప్రదేశ విశ్వహిందూపరిషదధ్యక్షులు
కాకినాడ. 18-3-'68.

శ్రీ గరిమెళ్ళ వీరరాఘవులుగారు రచించిన "విగ్రహారాధనతత్వము," "దేవాలయ స్వరూపతత్వము" అను రెండువ్యాసములను వారు వినిపింపగా విని యానందించితిని. ఈరెండును విజ్ఞానభరితములైన వ్యాసములు. హిందూదేవాలయవిధానమును, విగ్రహారాధన పద్ధతిని శాస్త్రీయముగాను యుక్తిసమ్మతముగాను ప్రదర్శించుచు నేటి సందిగ్ధమనస్కులకేకాక ఆస్తికులకుగూడ గల్గుచుండు సందేహములను పోగొట్టుటకు సమర్థములైన ఈ వ్యాసములు రెండును నొక క్రొత్తగ్రంథముగా ప్రకటింపబడుచో హిందూమతప్రచారమునకు దోహదము కల్గుననుటలో సందియము లేదు.

"దేవాలయతత్త్వము" దేవాలయమునకు మానవ శరీర నిర్మాణముతోను, విశ్వతైజస ప్రాజ్ఞులతోను, పరమాత్మ తత్త్వముతోను గల సంబంధము చక్కగా వివరింపబడినది. విగ్రహతత్త్వము, గర్భాలయ రహస్యము, గర్భాలయమందలి పరిమితజ్యోతిర్నియమము, కలశ, విమానస్థూపికాబింద్వాది పరమార్థము—ఇత్యాదులు మిక్కిలి విమర్శ పాటవముతో నిరూపింపబడినవి.

అట్లే "విగ్రహారాధన తత్త్వము" మన యారాధన విధానములోని వైజ్ఞానికసంపత్తిని కరతలామలకము గావించుచున్నది. విజ్ఞాన విరహితముగా ఉపాసనము చేయు మూఢుల పట్లకూడ పరమేశ్వరుని యనుగ్రహము ప్రసరింపకపోదు కాని "జ్ఞాత్వా కర్మాణి కుర్వీత" యను న్యాయమున తత్త్వము నెఱిగి కర్మోపాసనములను గావించువారికి ఫలవిశేషము గలదు. శ్రీ వీరరాఘవులుగారు మనకీజ్ఞానమును కలిగించుటకై యీ రచన గావించినారు. అఖండైకపరమేశ్వరతత్త్వమే శివసూర్యవిష్ణ్వంబికాది రూపమున నెట్లుపాసింపబడునదియు వీరు స్పష్టపరచినారు; అర్చన ప్రయోజనమును వ్యాఖ్యానించినారు. విగ్రహారాధనమే పరమేశ్వరారాధనమని యెట్టి సంశయాత్ములకైనను విశ్వాసము కల్గించినారు.

వీరి యీ రెండు వ్యాసములకును ఆస్తికశిఖామణులు హార్దికమైన స్వాగతము నొసగగలరని నా విశ్వాసము.

ఇట్లు,

జటావల్లభుల పురుషోత్తము.

# విన్నపము

ఇదిపరిశోధన గ్రంథము. అందుచే ఇతరుల రచనా సంగ్రహణము చేయకతప్పదు. స్వతంత్రరచనాగర్వము నాకులేదు సమన్వయమే నాది. విశ్వమందనేక పుష్పములు వికసించియుండును. మధుపమందలి మధువును సేకరించి తేనె పట్టున నుంచి మనకందించు చున్నది. మధుకరి దోషికాదని నా తలంపు మధుకరవృత్తిగా నీ గ్రంథమును తమకందించి తిని. ఆయా రచయితల నందందు పేర్కొనియున్నాను. వారందరికిని నా కృతజ్ఞతావందనములు నా యందాదరము జూపి దేవాలయ స్వరూపతత్త్వము మూర్త్యర్చనాతత్త్వము అను నా పుస్తకములను చదువగా విని తమ యమూల్యాభి ప్రాయమును వ్రాసియిచ్చిన ఆర్షవిద్యాభూషణ శ్రీ జటా వల్లభుల పురుషోత్తము M. A. గారికిని; తమ కెన్నిపనులున్నను నాయందు వాత్సల్యముజూపి పైనపేర్కొనబడిన నాపుస్తక ములను రెంటిని పరిశీలించి ఆ రెంటికి కలిపి ఏకముగా పీఠిక వ్రాసి ఇచ్చిన పండితశేఖరులగు కాకినాడలోని గవర్నమెంటు పీఠికాపురాధీశకళాశాలా ప్రధాన సంస్కృతోపన్యాసకులగు శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యులు M. A. గారికిని అనేక కృతజ్ఞతావందనములు. వారి పీఠికయు, శ్రీ పురుషో త్తముగారిచ్చిన పుస్తకాభిప్రాయమును రెండు గ్రంథములకును సంబంధించినవి కాన ఆ రెండు గ్రంథములకును ఆదియందు

వానిం జేర్చితిని. పాఠకులకు ఖర్చు తెలియగానుండుటకై ఆ వ్యాసములు రెండుగ్రంథములుగా విడదీయబడినవి. కాగితము మహాకరువైన ఈరోజులలో దొరకినకాగితమే మహాభాగ్యముగ చెప్పినంతవెలకు గొని, అచ్చుపనివారల జీతములు ఈ కరువు దినములననుసరించి బాగుగ పెరుగుటచే ముద్రాపకుల హెచ్చురేటునిచ్చి ఈ గ్రంథమును ప్రకటించుటమైనది. ఉదారులగు పాఠక మహాశయులు దీని నాదరింతురని నా విశ్వాసము.

ఆర్ష విద్యాభూషణ (శ్రీ) జటావల్లభుల పురుషోత్తము గారిచ్చిన అమూల్యమగు సలహాప్రకారము "దేవాలయ స్వరూపతత్త్వము- మూర్త్యర్చనాతత్త్వము" అను వ్యాసములను రెండుగ్రంథములుగా,విడదీసి అచ్చొత్తించడమైనది గాన. రెండుగ్రంథములందును వారి అభిప్రాయమును ప్రకటించితిని. నా యందాదరముతో తప్పులులేకుండ నిర్దుష్టముగ అందముగ నచిరకాలముననే ముద్రించి ఇచ్చిన కాకినాడలోని (శ్రీ) ప్రభాత్ ప్రింటింగ్ వర్క్సు వారికి నా కృతజ్ఞత దెలుపుచున్నాను. రాబోవు మా గ్రంథమునకు విరాళమునుకూడ ఇచ్చినందులకనేక కృతజ్ఞతావందనములు.

ఓం తత్సత్.

ఇట్లు, విధేయుడు
గరిమెళ్ల వీరరాఘవులు
రచయిత

కాకినాడ
1-8-70

# మూర్త్యర్చనాతత్త్వము

## చరిత్రసంగ్రహము

వేదములలో మూర్త్యర్చనావిధి గలదు. చారిత్రకు లెట్లు వ్రాసినను అనాదిగా నేటివఱకు ఆర్యులు విగ్రహారాధనను చేయుచున్నట్లును, అది నేటివఱకును అవిచ్ఛిన్నముగ సాగుచున్నట్లును ప్రతి పూర్వగ్రంథమునుండియు, ఆర్క్యాలాజికల్ శాఖవారి రిపోర్టులు, శాసనములు, చరిత్రగ్రంథముల నుండియు ఆధారములు చూపి వేరుగా నొక పుస్తకమును ప్రకటించితిని.

అట్టి హిందూ దేవతార్చనపై జైన, బౌద్ధ, చార్వాకాది మతవిప్లవము లెన్నియో వచ్చి 1500 సం॥రములు దేశమును కల్లోలపరచినవి. మఱియు క్రీ॥శ 7 వ శతాబ్దము మొదలు 18 వ శతాబ్దమువఱకు మహమ్మదీయపాలన ఏర్పడి హిందూమతమునకును, దేవాలయములకును చేసిన యపకృతి ప్రజలకు మరల విప్పిచెప్పవలసిన పనిలేదు. చరిత్ర చదివినవారెల్ల రెఱుంగుదురు వారి విప్లవము నేడు అఖండ భరతవర్షము ముక్కలు చెక్కలగుటకు కారణమైనది. పిదప నాంగ్లేయ ప్రభుత్వ మేర్పడి మన సాంప్రదాయముల నన్నిటిని తుడిచిపెట్టినది. వాని కపార్థములు గల్పించి నూరిపోసినది.

కాని ఇన్ని ప్రళయములను తట్టుకొని మూర్త్యర్చన అవిచ్ఛిన్నముగ సాగుచునేయున్నది. చిత్ర మేమనగా మనల నాక్షేపించు మతములవారందరును అన్ని దేశములవారును తుదకు మహమ్మదీయులుకూడ ఏదియో యొకవిధమగు విగ్రహారాధన చేయుచునేయున్నారని నాచే రచింపబడిన "దేవాలయములు - వాని పూర్వోత్తరములు" అను బృహద్గ్రంథమున నిరూపించియున్నాను. వారి విధానములు, ఉపచారములును భేదించవచ్చును. మహమ్మదీయులు ధూప, పుష్పోపచారములనే చేయుదురు. పీరపూజ, గోరీపూజ చేయుదురు. మోకరించి ప్రార్థించినపుడు కాబాశిలను ధ్యానింతురు. రోమన్ కేథలిక్కులు క్రొవ్వువత్తి దీపములుంచి జపముచేసి మద్య నైవేద్యముచేసి ప్రసాద భక్షణముచేయుదురు అమెరికాలో గృహస్థులు 'Grace before food' అనబడు నైవేద్యము చేయుదురు. ఇట్లనేకోదాహరణ లీయవచ్చును.

ఇంతపట్టుదలతో తమ ధనమాన ప్రాణములనొడ్డి ఇన్ని యుగములు పోరాడి ఆస్తికతను, విగ్రహారాధనను నిలబెట్టుకొనివచ్చిన హిందువులను మూఢులన, జెల్లునా? మనము చేయునది బొమ్మలపూజయా? నిజముగా నది బొమ్మలపూజయే యైనచో దానికొఱకు ఎక్కడను సృష్టిలోలేని ఈ వికారపు బొమ్మలేల? ఏ Bull-Dog నో పెట్టుకొనరాదా? ఈ విశేష స్వరూప మా విగ్రహముల కెట్లువచ్చినది? విగ్రహారాధన తత్త్వమెఱిగినవా రెవ్వరును మూర్త్యర్చనను బొమ్మలపూజ

యన సాహసింపరు. ఎంతటి మూర్ఖుడును తానొక ఱాతి బొమ్మను పూజించుచున్నానని భావించడు. దాని తత్త్వమెట్టిదో, దానివలన ప్రయోజనమేమియో తెలిసికొందము.

---

## మూర్త్యర్చనావశ్యకత

ప్రపంచమున నన్నిమతములును ముక్తి నొప్పుకొనినవే. కాన శాశ్వతత్వము, అస్తిత్వము, జ్ఞానము, ఆనందమును కోరునవే మానవ చరమ కోరిక శాశ్వతత్వము జనన మరణ రాహిత్యము. తాను చేసిన పుణ్యమునకు ఫలముగా దేవత్వమును పొందిన మానవుడు ఆ ఫలభోగానంతరము మరల మానవుడు కావలసినదే! కాన తేజోస్వరూపులగు దేవతలుకూడ జనన రాహిత్యమును కోరుదురు. దానికి జ్ఞానమవసరము. ఆ జ్ఞానము జనన మరణ, వృద్ధిక్షీణతలు లేని లోకములలో సాధింప రానిది. దేవతలకు పుణ్యఫలానుభవమే కాని సాధన వీలు లేదు. వారు బ్రహ్మలోకములకు వెళ్ళగలిగినచో బ్రహ్మను గురువుగా ఎన్నుకొనవలెను. లేదా భూలోకమునకు రావలెను. రెండే మార్గములు. వారికి నిద్రకూడ లేదు. అందుచే ఇంద్రియ జయత్వము సాధ్యముకాదు. అనేక జన్మార్జిత పుణ్యవిశేషముచే జ్ఞాన సంపాదనా సాధనమైన జన్మ ఈ కర్మభూమిలో ఋషిసంతతిలో మానవులముగా మనకు లభించినది కాన

యున్న భగవంతుని మంత్రసంస్కార విశేషములచే శిలామృద్దారు లోహ రత్నక్షణికాది చిత్రములయందు మంత్రశక్తిపాతము చేతను కళావిన్యాసతులచేతను భావనచేసి తత్తద్దేవతామూర్తులను వర్ణరూపనామాదులచే యంత్ర తంత్ర విధులతో నర్చించి భగవదనుగ్రహము పొందుట కర్మవాసనాబద్ధుడగు జీవునకు విహితము.

లోకమునందు రాజు రాజ్యపాలనా సౌకర్యముకొరకు లోహాది ముద్రలయందు తన అధికారపాతముద్వారా ప్రజల కెట్లు సర్వకార్యోపయోగములను కావించునో అట్లే బ్రహ్మాండ కర్తయగు పరమేశ్వరుడు శిలాదిమూర్తులయందు తనచే నిర్మితమైన ఆగమ శాస్త్రములలో చెప్పబడిన మంత్రశక్తి సన్నికర్ష ద్వారా ఆలయమందును, మూర్తులయందును సన్నిహితుడై భక్తులకును సాధకులకును ఇష్టకామ్యముల నొసగు చున్నాడు. నిర్గుణబ్రహ్మము సాధనచే తప్ప గ్రంథపఠనమాత్రముచే గోచరముకాదు. ప్రస్తుత చరిత్రకారులు భూమండల మును గ్లోబు తయారుచేసి, దానిద్వారా దేశములు, సముద్రములు. నదులు, పట్టణములు,పర్వతారణ్యములు చూపించునట్లు అద్వయ బ్రహ్మతత్త్వమును (అనగా జ్ఞానమును) ఉపాసనము క్రియాదులు నను స్కెచ్ ద్వారా చూపించి దేహమునకు, క్రియలకు బ్రహ్మాండమునకు శివశక్త్యాది మూర్తులకు అభేద ముచు భోధించుచున్నారు.

నిర్గుణుడగు పరమేశ్వరుని మనస్సులో నుపాసించుట ఆంతరమనియు, బాహ్యమనగా మంత్రములద్వారా మండల,

చక్ర, బింబ, కలశ, యంత్రాదులందు దేవుని శక్తిసంపాతము చేసి అర్చించుటయనియు,ఉపాసన ఇట్లు ద్వివిధము. సాధకునకు లక్ష్యము సిద్ధించుటకొఱకు ఏకైక సాధనమగు అర్చనకుగాను రూపమును కల్పించి పూజించుటయే బాహ్య పూజయని తెలియుచున్నది. ఇట్లు కల్పితమూర్తులందు దేవతాభావము నుంచి పూజించి తాను దేవతాభావమునంది క్రమముగా సాధనవలన తనకును దేవునకును అవినాభావమును సాధించి మోక్షమును పొందుటయే ఉపాసనారహస్యము" (శ్రీ తంగిరాల సుబ్రహ్మణ్య శాస్త్రిలుగారు, ఆరాధన పత్రిక)

"అజ్ఞానాం సాక్షా ద్భగవత్పూజాయాః కర్తుమశక్యత్వేన ప్రతిమాయామేవ కర్తవ్యత్వా త్తదర్థం ప్రతిమా నిర్మాతవ్యా" అని చెప్పబడినది. ప్రతిమయే భగవంతుని సంపూర్ణత్వము కాదు. ప్రతిమయందు భగవంతుడున్నాడు. ఆ ప్రతిమలో భగవంతుని సంపూర్ణత్వమును ఆకాలమున భక్తుడా పాతము చేసి ఉపాసించును. (మధ్వాచార్యుని తంత్రసారమునకు చల్లారిస్ వ్యాఖ్యకు శ్రీ కాఖ్యారి వ్యాసమూర్తిగారి అనువాదము) జుహోవాను ధ్యానించలేరు. తెలిసికొనలేరు. కను కనే క్రైస్తవులకు ఏసుక్రీస్తును, శిలువయు, చర్చియు కావలసి వచ్చినవి. ఆతనిపేరనే ప్రార్థన జరుపుట బైబిలుయొక్క విధియైయున్నది. అల్లాను స్వయముగ తెలిసికొనలేరు గావుననే మహమ్మదీయులు ధ్యానముచేసి ప్రార్థించునపుడు మహమ్మద్ గోరీపైనున్న కాబా శిలను ధ్యానింతురు.

"అహం బ్రహ్మాస్మి" అనగలిగిన అద్వైతసిద్ధులుకూడ లోకసంరక్షణార్థము మూర్త్యర్చన చేయవలసియున్నది.

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరోజనః

శ్లో॥ గతానుగతికో లోకో నలోకః పారమార్థికః

అనునట్లు సామాన్యులు అహంకారదుర్విదగ్ధులై తత్త్వము తెలియకపోయినను తత్త్వవిదులు మానివేసిరని తాముకూడ భగవదారాధన మానివేయు ప్రమాదమున్నది. కావుననే శ్రీ శంకరాచార్యాదులు శ్రీచక్రార్చనయు, చంద్రమౌళీశ్వరలింగార్చనయు చేసిరి.

శంకరులిట్లు వ్రాసియుండిరి. "తస్మాత్ మహతో బ్రహ్మణో విజ్ఞాన ప్రతీకేన ఉపాసనాత్ జ్ఞానైశ్వర్యవంతో భవంతి." "హిరణ్యగర్భోపాసనేన అణిమాదిః ప్రాప్తిః అనైశ్వర్యాది మృత్యుతరణంచ." "కానిచిత్ బ్రహ్మణః ఉపాసనాని కర్మ సమృద్ధ్యర్థీని - కానిచిత్ అభ్యుదయార్థీని - కానిచిత్ క్రమ ముక్త్యర్థీని" "నిర్గుణమపిసత్ బ్రహ్మ నామరూప గతైః గుణైః సగుణం ఉపాసనార్థం తత్ర తత్ర ఉపదిశ్యతే"

(బ్రహ్మసూత్రభా 1-2-14)

మ॥ ఉపవాస వ్రతశీల శౌచముఖసంధ్యోపాసనాగ్ని క్రియా జపదానాధ్యయనాది కర్మముల మోక్షప్రాప్తి చేకూరదు అని యుండుటచే భ్రాంతులై జ్ఞాపూర్ణులు కాకమున్నే ఆ క్రియల విడుచువారు ఉభయభ్రష్టులగుదురు గాన "ప్రతిమా

మందబుద్ధీనాం" అనుట 'నహినిందా' న్యాయముననే కాని వాస్తవమునగాదు. "దేవతలకు రూపమున్నదా అట్టిది కల్పన చేయుట తప్పుకాదా యని ప్రశ్నింపవచ్చును. దేవతలుమహా భాగ్యశాలురు కాన వారి కాకార పరిమితి లేదు. వారి కాకార మిట్టిదే, ఇంతియే యుండవలెనననిచో వారి మహాత్మ్యము నకు వ్యాఘాతము కల్పించినవారమగుదుము. సమస్తాకారము లును భగవంతునివే యైయున్నవి. సర్వాకారుడైన ఆతని ఆకారములకు నియమము లేనందునను, లేక, నశ్వరమైన ప్రాకృతాకారము లేనందునను పరమాత్మ నిరాకారుడని యెన్నబడుచున్నాడు.

( తంత్రసారము అనువాదకులు కా. వ్యా. మూ,

కార్లైలుకవి "The universe is but one vast symbol of God. What is man himself but a symbol of God" అనినాడు. ఆ విశ్వరూపుని విశ్వోపాస నమే విగ్రహారాధనమని ముందు ముందు చదువగలరు.

సాంఖ్యమున చెప్పబడిన 25 తత్త్వములతోను, యోగమున చెప్పబడిన అష్టాంగములతోను, వేదాంత; కర్మస్వరూపముల తోను, తత్త్వముల బ్రహ్మాత్మకత్త్వముతోను బ్రహ్మో పాసనాప్రకారముతోను, భగవదారాధన రూపొంది మిక్కిలి రహస్యమైయున్నది; శ్రేయస్కరమైనది. (వావిలికొలను సుబ్బారావుగారు, ఆరాధన సెప్టెంబరు 1962

తెలివిగల మంత్రులు లోకబాలుడైన రాకుమారునికి రాజ్యసింహాసనంబున బట్టముగట్టి యెంతకాలమున కాతడు రాజను నభిమానముచే బ్రజలందఱు నాతని యాజ్ఞకు లోబడువారలయ్యెదరో యంతవఱకు నాతని నెట్లు జాగరూకతతో సంరక్షించుచునేయుందురో యటులనే ప్రతీకమందు దేవతాబుద్ధి స్థిరపడు వఱకును ప్రతీకోపాసన మావశ్యకంబు. ఆపిదప నాభావము తొలగనేరదు.

శ్రీ పతంజలి మహర్షి సమాధి రెండువిధములని సిద్ధాంతీకరించినాడు.

1. సంప్రజ్ఞాతసమాధి :- ఇందుపాసకునియొక్కయు, ఉపాస్య దేవతయొక్కయు,ఉపాసనాక్రియయొక్కయు,జ్ఞానము కలదు.

2. అసంప్రజ్ఞాతసమాధి :- దీనియందు ఈ త్రిపుటి సుఖాంబుధియందు లయమగును కాన జ్ఞాన జ్ఞాతృ జ్ఞేయ భేద మింకను గలవారు నిర్గుణ బ్రహ్మంబు ననుభవించుచు అసంప్రజ్ఞాత సమాధినందుట యెట్లు?అందఱకు నది సాధ్యమా? కాన ఆస్థాయినందువఱకును సగుణోపాసన అవసరమే అయి యున్నది.

భగవంతునికి రూపము గలదాయని సంశయముండవచ్చును భగవంతు డనంత రూపముల దాల్చుటకు శక్తిగలవాడు కావున విగ్రహ మాతని యనంతరూపములలో దేనితోను

కూడ నేకీభవించకపోయినను నయ్యనంతరూపములలో నొక దానితో దుల్యము కాగలదు. అనగా విగ్రహము యొక్క రూపము భగవంతునియొక్క రూపమును బోలును. లేదా భగవంతుని రూపమే విగ్రహరూపము ననుకరించును. కాన శాస్త్రనిర్ణీతరూపముకంటె నన్యమైన రూపముతో భగవంతుడు గలడని భక్తుడొకడు తలచినను వాని యభీష్టప్రకారమే వానికి ప్రసన్నుడు కాగలడని గీతావచనము "యేప్యన్యదేవతా" అనుశ్లోకమునందు తెల్పుచున్నది. కాని శాస్త్రసిద్ధ రూపముల నుపాసించుటవలన పరమేశ్వరు డచిరకాలముననే ప్రసన్నుడగును కాన శాస్త్రసిద్ధమూర్తులే యుపాసనకు ముఖ్యము. (విగ్రహాభరణము : గో. హరిశ్చంద్రరావుగారు)

## సంకల్పము

"సంకల్పః కర్మమానసమ్" "యాదృశీ భావనాయస్య సిద్ధిర్భవతి తాదృశీ" ఎట్లు మన సంకల్పముండునో అట్టి సాధన మన ముచేయుదుము. దాని కట్టి ఫలములే మనకు సిద్ధించును. ఎవరి స్థాయినిబట్టి వారి యుపాసనాదులకు సంకల్పము చేయవలెను. మూర్తి నెంచుకొని సాధన చేయవలెను. తైత్తిరీయ భృగువల్లీ ఉపనిషత్తు ఇట్లు వక్కాణించుచున్నది.

శ్రు॥ సర్వమిత్యాకాశే। తత్ప్రతిష్ఠే త్యుపాసీత। ప్రతిష్ఠావాన్ భవతి। తన్మహ ఇత్యుపాసీత। మహాన్భవతి। తన్మన ఇత్యుపా

సీత। మానవాన్ భవతి।తన్నమ ఇత్యుపాసీత।నమ్యన్తే౽స్మైకా మాః। తద్బ్రహ్మేత్యుపాసీత। బ్రహ్మవాన్భవతి। తద్బ్రహ్మణః పరిమర ఇత్యుపాసీత॥పర్యేణం మ్రియంతే ద్విషన్త స్సపత్నాః॥

అనగా బ్రహ్మము ఆకాశమునందు సర్వస్వరూప ముతో ప్రతిష్ఠితమయి యున్నదని ఉపాసింపవలెను. ఆ బ్రహ్మ రూపమగు ఆకాశము సర్వమునకు ప్రతిష్ఠయని ఉపాసింపవల యును. అట్టివాడు ప్రతిష్టగలవాడగుచున్నాడు. ఆ బ్రహ్మ స్వరూపమగు ఆకాశము మహః అని ఉపాసించినచో ఆయు పాసకుడు మహత్త్వము గలవాడగుచున్నాడు ఆ బ్రహ్మస్వరూ పమగు ఆకాశము మనన స్వరూపము గలదని ఉపాసించినచో మననమునందు సమర్థుడగుచున్నాడు. ఆ బ్రహ్మమును ఈవిధ ముగా ఉపాసించువాని కోరికలన్నియు తీరుచున్నవి. ఆ బ్రహ్మనే విరాడాత్మయని ఉపాసించినచో బ్రహ్మమేయగుచున్నాడు. లేక వేదములు వానికి స్వాధీనమగుచున్నవి. ఆ బ్రహ్మమునే పరిమరమని ఉపాసించువానికి శత్రులు నశించుచున్నారు."

ఇట్లు ఒకే భగవంతుడు ఉపాసనాభేదమునుబట్టియు, స్థాయినిబట్టియు వేరువేరు ఫలముల నొసంగుచున్నాడు. ఈ యుపాసన స్థూలమునుండి క్రమముగా దారి తీసి తుదకు బ్రహ్మమునందు నిలచును. ఇది ప్రతీకోపాసనాలక్షణము. ఈ లోగా ఆయా స్థాయిల ననుసరించి ఆయా ఫలములు కలుగునని పతంజలి మహర్షి "సూ॥ తస్య భూమిషు వినియోగః" అను

సూత్రమున వివరించియున్నాడు. కాన ఉపాసనకు తగు సంకల్పమును, తదనుగుణమూర్తియు తదనుగుణ సాధనా విధానమును అవసరము.

# అంగన్యాసకర న్యాసములు

శబ్దతరంగము ననుసరించియే శక్తి వికాసమగును. "Matter is nothing but sound" అనికదా! ఆధునిక విజ్ఞానశాస్త్ర సిద్ధాంతము. శక్తినుద్బోధించు సూక్ష్మవాదము బీజమంత్ర సమూహము అదియే చిన్మయి; ఆత్మ. కాన దానినుద్బోధించు బీజ, మంత్రములుకూడ చైతన్యమయమే. కాన నాయా భగవచ్ఛక్తులకు తగిన బీజ, మంత్ర, న్యాస, నామావళ్యాదు లేర్పాటైనవి. ఆ బీజమంత్రములను శరీరమున న్యాసము చేసికొనవలెను. "దేవోభూత్వా దేవాన్యజేత్" అని శుక్లయజుర్వేదము విధించినది. నీవు దేవతుల్యుడవై దేవతాపూజ చేయుమని దాని కర్థము. ఇదెట్లు? మన మంగన్యాస కరన్యాసములు చేసి దేవతార్చన చేయుచున్నాము. మన శరీరభాగముల కాయా యధిష్ఠానదేవతలు గలరని శాస్త్రము చెప్పుచున్నది. ఈవిషయము నాచే రచింపబడిన 'నటరాజు' అను గ్రంథమున వివరించితిని. ఆయా తత్త్వాధిష్ఠాతలగు దేవతలను తన శరీరమున గుర్తించి గౌరవించి

వారందరికన్న మిన్నయగు పరమేశ్వర శక్త్యుపాసనమున విఘాతములు కలుగకుండుటకు వారిని అనుకూలింప జేసికొనుటయే యది. తాను దేవతాంశగా దెలిసికొనుట. లౌకిక దృష్టితో జూచినను ఆయా ఇంద్రియవిషయములకు లోనుగాకుండునట్లు ప్రతినబూనుటయే యది. "హృన్మంత్రముతో భక్తుడు పరమాత్మను హృదయములో నుంచుకొని చూచును. శిఖా మంత్రముతో తన శరీర రూపాదులను హృదయములోని కాకర్షించును. వర్మ మంత్రముచే మనస్సు నితరవిషయముల నుండి మరలించి సందిత్ యొక్క పరమాత్మయందు లగ్నము చేయును. ఇది 'నేత్రసంజ్ఞా' యనబడును. దానితో తాప త్రయము లడగును. (నారద పంచరాత్రము III భా రాత్రి III 6 అధ్యా. 5)

ఇది సమస్త దోషహరము. భగవత్సాధనకు భూమిక. న్యాసనమున కర్థము. శరీరము లోపలను వెలుపలను అంతటను విశ్వమయుడగు భగవంతుని కన్గొని తన్ను మఱచుట (నారదపంచరాత్రము IV రాత్రి 20 అధ్యా.) ఎదుటనున్న ప్రతిమయందు బ్రహ్మాండమందునుకూడ తదంశలను గుర్తించి విరాడ్రూప భావన ధ్యానాదులు చేయుటయే న్యాసవిధి. ఆ విరాడ్రూపము నర్థముచేసికొనుచు ధ్యానించినచో పరమార్థ దర్శనమగును. న్యాసాదులవలన హృదయమున సుప్రతిష్ఠితమైన దేవతయొక్క శక్తులను మనయందావాహన చేసికొని మన మా దేవతారూపమగుచున్నాము. కవచార్గళ కీలకాదులవలన మన మజేయు

లమను భావము గల్గును. న్యాసాదులవలన నాశక్తులు మనలో నిక్షిప్తమగును. దశదిగ్బంధనముచేసి అగ్నిప్రాకార మంత్రము ననుష్ఠించి జపమునకు గూర్చుండిన శ్రీ రామకృష్ణ పరమ హంస చుట్టును అగ్నిప్రాకారము కనబడెడిదని యాతని చరిత్రవలన దెలియుచున్నది. "మంత్రము స్పందనము అను భూతియు మూడును ఏకస్వరముతో మీాది కుబుకునపుడు న్యాసము సిద్ధించును. చైతన్యమయ న్యాసముచే అనేకా లౌకికశక్తులు పుట్టును. (శ్రీభాగవతుల కుటుంబశాస్త్రిగారు)

---

# విగ్రహము-దేవతావిర్భావము

విశ్వమునంతను మన మేకముగా చూడలేము. అందున్న భగవంతుని గుర్తించి మనస్సు నాతనియందు లగ్నము చేయ లేము. ఆవిశ్వసంజ్ఞయగు మూర్తియందు విశ్వమయుడగు పరమాత్మ లేకపోలేదుగదా! పరమాత్మ అవిచ్ఛిన్నస్వరూ పుడు గాన అణువు మొదలు మహత్తువఱకు అన్నిటియందు పరిపూర్ణుడుగానే ఉన్నాడు.

శ్రు॥ అణోరణీయాన్ మహతో మహీయాన్
ఆత్మాగుహాయాం నిహితోస్యజంతోః ॥

అను శ్రుతి ఈ విషయమునే తెల్పుచున్నది

"విగ్రహమును విగ్రహమనుకొనుటయే భ్రమ ఏలనన వాస్తవముగా నది పరమాత్మయే యైయున్నది. కాన విగ్ర

హారాధన మద్వైతసిద్ధికి వ్యతిరేకముగాదు. ఆరోపమార్గము చేత భగవంతునికి విగ్రహమునకు రెంటికి నేకత్వంబు సాధింపవలయును. ఇదియే యుపాసన. రెండును నొకే వస్తువే యను నభేదబుద్ధి దృఢమగువఱకును నారోపవాదాత్మకంబైన యభ్యాస మగత్యమైయున్నది. కాన విగ్రహారాధన నట్లు చేయవలెను." (విగ్రహాభరణము గో. హ. రావుగారు)

ఆ మూర్తియందున్న పరమాత్మను భావన, ధ్యాన, కళావాహనాదులచే ప్రత్యక్షము చేసికొని, అతని యస్తిత్వమును అందు స్థిరపరచుకొని, దర్శించి, న్యాస సమయమున మనలోనున్న ఆతత్త్వమునే మూర్తిలోనున్న దానితో సమానాధికరణము చేసి అప్పుడు విరాడ్రూప భావనయు పరమాత్మ భావనయు చేసినచో మనకు విశ్వమందంతటను ఆతని తత్త్వదర్శనమగును. అయినచో మూర్తియం దవ్యక్తముగనున్నవాడు వ్యక్తమెట్లుకాగలడు అనుప్రశ్న వేధించును. "మంత్రాధీనంతు దైవతమ్" అను వచనానుసారము మంత్రాధీనుడైన దేవుడు శిలావిగ్రహమున వ్యక్తము కాగలడు ఆతని వ్యక్తశక్తి భక్తున కనుగ్రహము చూపును. అందులకు నిదర్శనమున్నదా యనవచ్చును.

శా॥ అంభోజాసనుఁ డాదిగాఁగ తృణపర్యంతంబు విశ్వాత్ముఁడై।
సంభావంబున నుండు ప్రోడవిపులస్తంభంబునందుండఁడే?

అని ప్రహ్లాదుడు ఉక్కుస్తంభమున పరమాత్ముని ప్రత్యక్షముచేసి చూపినాడు. అది పురాణగాథ యనవచ్చును.

మన యుగములోకూడ తాన్‌సేన్‌యొక్క పాటకు దీపములు తమంత తాము వెలిగెను. తిరుపతిలో త్యాగరాజు పాటకు భగవన్మూర్తిని జూడ నడ్డమగుచున్న తెర చినిగి క్రిందపడెను. తులసీదాసు నైవేద్యము చేసినదానిని శివలింగ మారగించెను. కృష్ణప్రతిమయే మీరాభాయితో నాడుకొనెను.

(గానకళాపతిక)

దేవాలయ ప్రదేశమునందంతటను దివ్యస్పందనములు ప్రసరించుచుండును. భక్తుల కాయనుభూతి కలుగును. బీజాక్షర మంత్రశక్తిచే దేవత ప్రబుద్ధము చేయబడినపుడు భగవచ్ఛక్తి వశమై మూర్తియందావిర్భవించుట యసంభవమెట్లు కాగలదు? అదియే యసంభవమగుచో ఇతర మతములవారి యొక్క కేవల ధ్యానమున కాతడు సాక్షాత్కరించుననునది నమ్ముటెట్లు? తగిన సాధనయున్నచో భగవత్సాక్షాత్కారమెచ్చటనైన నగును.

---

# భక్తితత్త్వములు వాని ఫలములు

"భక్త్యావినా బ్రహ్మజ్ఞానం నకదాచిదపిజాయతే ।

(మహానారాయణము)

భక్తినిరధిష్ఠానముగ సంభవింపదు కాన సగుణోపాసనావసరము గల్గినది.

"అజ్ఞానాం భావనార్థాయ ప్రతిమాః పరికల్పితాః॥"
(దర్శనోపనిషత్తు)

మేధాతిథి మునీంద్రుడు ఇంద్రుని మేషమని వెక్కిరించుచు పిలువగా ఇంద్రుడు మేషరూపమునంది వానిని హరించెను. కాన దేవతలు కామరూపులు (బ్రి.సూ. దేవతాధికరణము) వేదమున వజ్రహస్తః పురందరః అను స్వతః ప్రమాణ సమర్థనములు దేవతల కాకృతులున్నవి అనుటకు ఉన్నవి. ఆ స్వరూపములను సాక్షాత్కరింప జేసికొనుటకు భక్తి, ధ్యానసిద్ధులు అవసరము. భక్తిసాధనవలన నెట్టిఫలములు చేకూరునో భక్త చరిత్రలు నాడును నేడునుకూడ దెల్పుచున్నవి. భక్తిసాధన నెట్లు చేయవలెనో, ఎంతవఱకును ఆసాధన ఆచరణ సాధ్యము కాగలదో, అట్టిసాధన ఎట్టి యద్వైతసిద్ధిని సాధింప సమర్థవంతమైనదో, దాని ఫలమెట్లుండునో, ప్రహ్లాదచరిత్ర మనకు దెల్పుచున్నది. ఆతనిది తత్త్వజ్ఞానముతోఁగూడి అనుభవసిద్ధిగన్న భక్తి. మనుష్యుడాచరింపగల్గు భక్తిపారము నాతడు ఆచరణద్వారా చూపినాడు. ఆతడు తత్ఫలితముగా నిరపాయతనంది అద్వైతసిద్ధి గాంచినట్లు భాగవతములోని ఈక్రింది గద్యపద్యములు తెల్పుచున్నవి.

ఉ॥ తన్నునిశాచరుల్ వొడుచు దైత్యకుమారులుమాటిమాటికో।
పన్నగశాయి! యోదనుజభంజన! యోజగదీశ! యోమహా।
పన్నశరణ్య! యోనిఖిలపావన! యంచునుతించుగానితా।
గన్నులనీరు దేడు, భయకంపసమేతుడుగాడు, భూవరా॥

ఇందు కేవల భగవన్నుతియే గాని రక్షింపుమను నార్త నాదము లేకుండుట విశేషము. ఆతడు తన్ను భగవదర్పణ జేసి నిర్లిప్తుడయ్యె. రక్షించినను భక్షించనిచ్చినను భగవంతునిదే పూచీ. ఇదియే మార్జాల కిశోరన్యాయము.

ఉ॥ పాఱడు లేచి దిక్కులకు, బాహువులొడ్డడు, బంధురాజిలో
దూఱడు,ఘోరకృత్యమని దూఱడు,తండ్రిని, మిత్రవర్గముం
జీరడు, మాతృసంఘము వసించు సువర్ణగృహంబులోనికిం
దాఱడు,కావరేయనడు,తాపమునొందడు, కంటగింపడున్॥

అతనికి శరీరస్మృతియే లేదు అని ఈపద్యమువలన దెలియును.

చ॥ పలువురుదానవుల్ వొడువబాలునిదేహము లేశమాత్రము
న్నొలియదు,లోపలన్ రుధిరముబ్బదు, కందదుశల్యసంఘమున్
నలియదు,దృష్టివైభవమునష్టముగాదు,ముఖేందు కాంతియుం
బొలియదు,నూతన శ్రమము పుట్టదు,పట్టదు దీనభావమున్॥

ఆతడు భగవత్కృపవలన నిరపాయత నొందుట ఇందు గాననగును. "ఇట్టి సర్వాత్మకంబై ఇట్టిదట్టిదని నిర్దేశింపరాని పరబ్రహ్మంబు దానయై యమ్మహావిష్ణువియందు జిత్తంబు జేర్చి తన్మయుండయి పరమానందంబునం బొందియున్న ప్రహ్లాదుని యందు రాక్షసేంద్రుండు దన కింకరులచేతం జేయించుచున్న మారణకర్మంబులు పాపకర్మునియందు ప్రయుక్తంబులయిన సత్కారంబులుంబోలె విఫలంబులగుటంజూచి" ఆశ్చర్యపోయి నాడు. ఇక్కడ భక్తిప్రపత్తులకును అద్వైతజ్ఞానసాధనకును అభేదముచూపబడి రెంటికినేకమగు చరమఫలమగు నద్వైత సిద్ధినందుట చూపబడినది.

ద్రౌపది అవ్యవధిలో ఆర్తప్రపన్నురాలుకాగా కావు సిద్ధిమాత్రము వడసినది. గజేంద్రుడెంతయో జ్ఞానభక్తి చూపెను కాని ఇంకను శరీరరక్షణ కోరుచునే యుండెను. ఆతనియెడ భగవంతుడు ప్రసన్నతజూపి సాలోక్య సామీప్య ముక్తులనిచ్చి రక్షించెను. ఇష్టముచే భీష్ముడును, వైరముచే కంస శిశు పాలురును నిరంతర నిష్ఠ జూపి సాయుజ్యము వడసినారు. రాధ సారూప్యత నందెను. ప్రహ్లాదుడు భక్తిపారముచే తానే పర బ్రహ్మమైనాడు; గురువగు నారదుని మించి భక్తులలో ప్రథమ గణ్యుడయ్యెను. ఇట్లు వారి వారి భక్తిస్థాయినిబట్టి వేర్వేరు ఫలములు గల్గుచుండును. ప్రహ్లాదునివలె అద్వైతసిద్ధినందుటకు గూడ సాధనము భక్తిప్రపత్తు లుపకరించునని గుర్తింపవలెను. ఆతనిది తైలధారవంటి నిరంతర భక్తిప్రవాహము. అటువంటి ప్రహ్లాదుడుకూడ తరుణోపాయముగా నవవిధ భక్తులను ప్రవ చించినాడు:—

మ॥ తను హృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్
వందనా। ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీ
ర్తనల్ చింతనం। బను నీ తొమ్మిది భక్తిమార్గముల
సర్వాత్మున్ హరిన్ నమ్మి స। జ్జనుడై యుండుట భద్ర
మంచు దలతున్ సత్యంబు దైత్యోత్తమా !

అనినాడు. ఈ తొమ్మిదిమార్గములలో ఒక్కొక్క మార్గమును చేపట్టి తరించిన భక్తులు గలరు. కాని ముక్తి సౌధమునకు తొమ్మిదియు మెట్లని నా యుద్దేశ్యము. ఒక మెట్టు

నెక్కనగాని తరువాత మెట్టెక్కుటకు వీలులేదు చూడుడు. భగవంతుడన్న ఇష్టమున్నగాని ఆతనిగూర్చి వినుట తటస్థించదు. ఆ రెండును చేకూరినగాని భగవంతునికి దాసుడు కాజాలడు. దాసుడైనగాని వందనార్చనములు సేయడు. వందనార్చనము లేకాగ్ర మనస్కతతో చేసినగాని ఆత్మలో భగవత్తత్త్వ మెఱుకపడదు. ఆ యెఱుక గల్గినపిదపనేగాని దానిని నిల్పుకొనుటకు సంకీర్తన చేయడు. సంకీర్తన చేసినగాని చింతన (నిధి,ధ్యానలు) కుదరదు. చింతనగల్గి భక్తి స్థిరపడినగాని ముక్తి లభింపదు. ఇట్లు నవవిధ భక్తిసాధనలు ఒకదానికొకటి యాలంబములై తుదకన్నియు స్థిరపడినవెనుకనే పూర్ణఫలము లభ్యమగుచున్నది.

---

# దేవతార్చనా సౌలభ్యము

ఆ నవవిధభక్తులలో అర్చనయొకటిగదా! ప్రహ్లాదు సంతవానికిని శ్రీ శంకరాచార్యులంతటివారికిని భగవదర్చన అవసరముకాగా మనబోంట్లు లెక్కయేమి?

భగవదర్చన యనునది యొక యోగము. అంచు మధురమైన యనుపానముతో బాలుడు మందును గ్రహించునట్లు, సకలేంద్రియములును తృప్తిచే నివృత్తి నందగా చిత్తైకాగ్రత గల్గి పైనజెప్పబడిన మిగిలిన సోపానముల నెక్కుటకు వీలు

కలుగును. దేవతాప్రత్యక్షత, ఆత్మతృప్తి, అలౌకికసంఘటనము, మొదలగునవి పూజాకాలమునందే ప్రాప్తములగును. ఈవిషయమునే ప్రహ్లాదుడు బోధించెను:—

సీ॥ కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరి దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తమునిమీది బుద్ధి బుద్ధి
దేవదేవుని చింతించు దినము దినము
చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు
కుంభినీధవు జెప్పెడి గురుడు గురుడు
తండ్రి! హరి జేరుమనియెడి తండ్రి తండ్రి.

అనియెను. ఇట్లు మనస్సా పరమాత్మ ధ్యానములో నుండగా, చేతులా పరమాత్మునికి పూజచేయుచుండ, నాలుక యాతని సహస్రనామావళి నుచ్చరించుచుండ, శిరమాతనికి నతిసేయగా, వీనులాతని నామ, గీత, వాద్యముల వినుచుండగా, పదములాతనికి ప్రదక్షిణించి నృత్యముచేయగా, మేను పులకరింపగా, ముక్కు ఆస్వామికి పూజచేసిన పూవ,

సువాసనకు తృప్తి జెందగా, పాయూపస్థలు నియమబద్ధములై మనస్సు వానిని మరచియుండుటచే నివృత్తి జెందగా ఇట్లింద్రియ వ్యాపారములన్నియు నణిగి, ఏకోన్ముఖమై భగవంతునియందు మనోబుద్ధి చిత్తాహంకారములు లయించి యోగసాధన చక్కగా సాగును. ఇదియే మూర్త్యర్చనా పరమార్థము. ఆపని యోగాభ్యాసమునందువలె బలవంతముచేతగాక, జ్ఞానమార్గములోవలె చెరుపు మరుపులు, క్రిందు మీదులుగాక చక్కని బాటలో హాయిగ సాగిపోవును. ఇదియొక యాకర్షణావిధాన చిత్తవృత్తి నిరోధము. చిత్తవృత్తి నిరోధమే పరమార్థలబ్ధికి మూలమని అన్ని మతములు అంగీకరించినవిగదా! ఇట్లు క్రమముగా ఇంద్రియ వృత్తులు బాహ్యప్రపంచము నుండి తొలగి భగవత్ప్రతిబింబముద్వారా భగవదాయత్తములగును. చిత్తమంతర్ముఖమగుచుండును. అంతర్ముఖమైన చిత్తమాత్మయందు పరమాత్మ నవలోకించును. Habit is the second nature అని ఆంగ్లసామెత గలదు. ఒకనాడు నిష్టకుదరకున్నను త్వరలో సాధనచే కుదురును. ఇంద్రియములకు పనిచెప్పకున్నచో నవి విజృంభించి స్వైచ్ఛారముచేసి దుర్గతి గల్గించును. Idlemans brai  is t  e Devil's work shop అన్నారు. కావుననే కులశేఖరాళ్వారు లిట్లాత్మప్రబోధము చేసికొనినారు:-

శ్లో॥ జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం చేతో భజశ్రీధరం
పాణిద్వంద్వ సమర్చయాచ్యుతకథాం శ్రోత్రద్వయం
త్వం శృణు

కృష్ణం లోకయ లోచనద్వయ హరేర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం
జిఘ్ర ఘ్రాణముకుంద పాదతులసీం మూర్ధన్నమాధోక్షజం॥

అని. అవినిర్వ్యాపారముగానుండి దుర్వ్యాప్తులకు దిగకుండ సద్వ్యాపారమున మునిగి చిత్తైకాగ్రతా యోగమున కనుకూలించునట్లు చేయుటయే విగ్రహారాధన. అంతియే కాని బొమ్మలపై పూజాద్రవ్యముల నొలుకబోసి యాడుకొనుట కాదు.

---

# అర్చనా స్వరూపము

"గౌరవిత ప్రీతి హేతు క్రియాపూజా" భక్తిచే గౌరవించు క్రియలే పూజ. పరమాత్మ స్వరూపభావనను శిలామయ విగ్రహమునందు నిల్పి, బ్రహ్మభావన దానియందు స్థిరపడిన వెనుక సాధకుడు దానిని తన శరీరమున నంతర్లీనము చేసికొని ధ్యానించుటయే, అనగా శరీరముయొక్క బాహ్యాంతరములందు రెంటను భగవదస్తిత్వమును గుర్తించి ఆంతరంగికార్చన చేయుటయే విగ్రహార్చన. పరమార్థముగ శ్రీ మధ్వాచార్యులవారి తంత్రసారములో వ్రాయబడియున్నది. "విగ్రహము భగవంతుడను విషయము పంచేంద్రియ విషయము గాకపోయినను శాస్త్రసిద్ధమగుటవలన విగ్రహత్వబుద్ధి నశించి, బ్రహ్మత్వబుద్ధి విగ్రహమునందు జనించువఱకును విగ్రహమును బ్రహ్మ

ముగా ధ్యానింపవలెను. పాషాణాది ప్రతిమలందు శాస్త్రప్రోక్త ములైన చతుర్భుజత్వాది భగవద్రూపముల నారోపించి, చతుర్భుజత్వాది బుద్ధిచే పాషాణత్వాది బుద్ధిని బాధింపవలయును. శ్రీ సురేశ్వరాచార్యులవారు తైత్తిరీయ వార్తికమునందు ఇట్లానతిచ్చియున్నారు :-

శ్లో॥ శాస్త్రోక్తదేవతధ్యానాపేత్యాహ్యతాదాత్మ్యాభిమానతః ।
చిరాసనం భవేదర్థే। తదుపాసన ముచ్యతే॥

శాస్త్రముచేత బేర్కొనబడిన దేవతయను భావముతో నొక యుపాస్యవస్తువును బొంది యట్టివస్తువే దేవతయను నభేదబుద్ధి జనించువఱకును జిత్తమద్దానియందు జిరకాలము నిలచుటయే యుపాసన మనబడుచున్నది ఈ భావమునే శ్రీ విద్యారణ్యస్వామి తైత్తిరీయ శిక్షావల్లీభాష్యమున విస్తరించియున్నారు. ప్రతిమాజ్యోతి నాత్మజ్యోతియందే యుద్వాసనంబు చేయవలెను. ఆవాహనములో ఆత్మజ్యోతినుండి ఆవాహన చేయవలెను. అఖిలభూతంబులందును ఆత్మయందును అమరువానిగ నెఱిగి సర్వాత్ముడైన హరిని, ఇష్టప్రతిమయందు బూజింపగాదగునని పద్మపురాణ పాతాళఖండమున చెప్పబడినది.

---

## సమయాచారము (ఆంతరంగికార్చన)

దహరాకాశమునందు శ్రీచక్రమును భావించి యచ్చట జేయు పూజాదికము సమయాచారము. వసిష్ఠాది తంత్రపంచక

మునకు సమయ వ్యవహారమని పేరు. ఆ తంత్రములందు చెప్ప బడినరీతిని శివునితో సమానముగా జెప్పబడుటచేత దేవి సమయాదేవి యనబడును. ఈ విధానము నవలంబించువారు సమయాచారు లనబడుదురు.

మూలాధార చక్రమునుండి లేచిన కుండలినీదేవి మణి పూరమునందు ప్రత్యక్షముకాగా నచట పాద్యాది భూష ణాంతోపచారములతో బూజింపవలెను. ఆమె ననాహతము నకు గొంపోయి అచ్చట తాంబూలాంతమగు నుపచారములచే నర్చింపవలెను. పిదప నామెను విశుద్ధచక్రము దాటించి చంద్రకళాస్థానమగు ఆజ్ఞాచక్రము జేర్చి నీరాజన మీయవలెను పిదప సహస్రారమున శివునితో సంయోజించి ధ్యానించి ఆ పిదప కుండలిని తన యథాస్థానమగు మూలాధారకుల కుండమున జొచ్చు సమయమువఱకు ఆ ధ్యానములో నుండుట సమయాచారము. (శ్రీ ఈశ్వర సత్యనారాయణగారు)

---

# కలశస్థాపన

సాధారణముగ దేవతా విగ్రహము లేనిచోట కలశ స్థాపనము చేయుచుందురు. అంగదేవతాపూజ కొఱకుగూడ దానిని స్థాపించెదరు. కలశ ప్రధానమూర్తి స్థానము నాశ్ర

మించును. అందు ఘట, పల్లవ, ఫల, జల, రత్నస్థాపనలు కలశస్థాపన కంగములు. అది హృదయఘట ప్రతిబింబము. కాన చైతన్యము విశేషముగా నభివ్యక్తమగు తావు. లోపలి ఏ కేంద్రమునుండి మంత్రోచ్చారణ జరుగునో (హృదయ మన్నమాట) ఆ కేంద్రమువైపు మంత్రోచ్చారణముతో చిత్తము ముందడుగు వేసి విజ్ఞానక్షేత్రమునందు జేరునపుడే దేవతావిర్భావస్థానమును గుర్తింపగలడు." (శ్రీ ఉప్మాక నారాయణమూర్తిగారు) హృదయకుహరమే స్వర్గము. అనగా దేవతాస్థానము అని మంత్రపుష్పములో పఠించుచున్నాము. అట్టి ఘటస్థాపనానంతరము పూజ యారంభమగును అట్లు స్థాపించిన కలశములోనుంచు జలము భావప్రతినిధి. హృదయ ఘటమును పుణ్యభావ జలముతో నింపకున్నచో జ్ఞానోదయము కాదు. దేవతాస్వరూప భావనాప్రతీకమే కొబ్బరికాయ 'పూర్ణ ఫలము' దాని యఖండజ్ఞానశిఖపై వైపునకుంచుదురు. దాని గుజురే మేధస్సు. దాని కన్నులు త్రికాల ప్రతినిధులు, మామిడి, రావి, జువ్వి, రేగు, మేడి అను పంచపల్లవములు 'చిగురుకొమ్మలు' పంచకర్మేంద్రియ ప్రతినిధులు. ఘటములో నుంచు పంచరత్నములు పంచ జ్ఞానేంద్రియ ప్రతినిధులు. వీని యన్నిటి స్థాపనతో ఘటము సర్వతత్త్వ సంపూర్ణమై పూర్ణ మూర్తిత్వము వహించును.

మండపమందలి కలశత్రయమే గుణత్రయము. ప్రతిమా, తండుల, కలశ, వస్త్రాదులే దేహమందలి త్వగాది ధాతువులు

దీనిస్థాపనతో సమష్టి వ్యష్టిరూప బ్రహ్మాండ బ్రహ్మాలకైక్యము ఘటిల్లినది.

---

## అర్చన ఎట్లు చేయవలెను

అర్చన మూలమంత్రముతో చేయవలెను. "మూలమంత్రేణ పూజయేత్" అని విధిగలదు. ఈవిధానమునే కల్పోక్త విధానమందురు. పురుష సూక్తము, లేక, దేవియైనచో, శ్రీసూక్తవిధానముగా ఆ సంకల్పముతో పూజింతురు. ప్రత్యేక దేవతామూర్తికి రెండువిధానములచేతను చేయు ఆచారమున్నది. అందులకు కారణము తరువాత వివరింపబడును. పూజలో నామావళిని ప్రణవముతో ప్రారంభించి 'నమః' తో నామము నాఖరుచేయవలెను.

విగ్రహమును పూజించవలెను కాని ఏకకాలమున విగ్రహమునంతను గ్రహించలేము. పూజించనులేము. విగ్రహ అవయవ విశేషార్థములనన్నిటిని ఏక కాలమున స్మరించుటయు కష్టము. కాన ఆతని యొక్కొక్క అవయవమునే ఆరాధించుచు పూర్తి చేయుట కర్తవ్యము. దీనినే 'అథాంగపూజా' యని కల్పములో నామపూజకు ముందు ఏర్పాటుచేసిరి. అందు పాదాది శిరఃపర్యంత మొకవిధానము. ఇది యారోపప్రక్రియ శ్రీ శంకరులు దీనిననుసరించి శివ పాదాదికేశాంతస్తుతి చేసినారు.

శీర్షాది పాదాంతపూజ ఇంకొక విధానము ఇది యవరోహక్రమ క్రియ. సౌందర్యలహరిలో ఆచార్యులవారు దేవి నీక్రమములో స్తుతించిరి. ఒక్కొక్క అవయవమునే పూజించి ఆ భాగమునకు చెప్పబడిన మంత్రములోని శాస్త్రసిద్ధగుణము లను వాని విశేషార్థములను మననముచేసి ధ్యానించి, పిదప మరియొక అవయవమును పూజించుట కర్తవ్యము. భగవద్విగ్రహమందలి ప్రతిభాగమునకు ప్రత్యేక శాస్త్ర రహస్యార్థములు గలవు. వానిభావనలతో మనస్సును నింపి ఆభాగమును పూజించి ధ్యానముచేయుచు విగ్రహమునకు సర్వాంగపూజ గావించినచో విగ్రహపూజ పూర్తియగుసరికి విగ్రహతత్త్వము అంతయు మనస్సునకెక్కి భక్తి స్థిరపడును. అపుడు పూర్తిధ్యానము చేసినచో నిధి ధ్యాసలు గల్గును. ఇది పృథక్కరణ (Specialised) యొక్క పరిధమప్రయోజనము. పాదాది శిరః పర్యంతపూజ భాగవతులొప్పినదే "సంచింతయే ద్భగవతశ్చరణారవిందం."(భాగవతము)"ప్రథమం చుంబితచరణా జంఘాజానూరు చక్రాణి" 16శ్లో(ఇది జగన్నాథ పండితరాజు తన 'భామినీవిలాసము' కడపట భగవన్మూర్త్యుపాసనాక్రమము నిటులసూచించె) అనగా "నాచిత్తవృత్తి మొదట విష్ణునియొక్క ముద్దుపెట్టబడిన పాదములు గల్గి తరువాత వరుసగా జంఘలను జానువులను నాభిమండలమును కౌగలించుకొని యటుపిమ్మట ముఖపద్మముయొక్క సౌందర్యమందు క్రీడించుగాక" అని. నాయిక మొదట ప్రాధేయపడి

పాదములకెరగి పిమ్మట పరిరంభాదులను యథేచ్ఛగా ననుభ వించి కడపట ముఖవిలోకనమందు విశ్రాంతి నొందు భంగి భక్తుని భావనయు నొనరించునని యాశయము ఇది మధుర భక్తిరీతి.

ఇటు అంగపూజ చేయుటవలన విసుగు జెందక చాలసేపు భగవత్సేవలో నిమగ్నులగుటలోని సౌకర్యము రెండవప్రయో జనము.

ఇట్టి పూజలో సౌందర్య వైచిత్ర్యమువలన సంతోష బాహుళ్యము గల్గును.ఆప్యాయత హెచ్చును ఆ విగ్రహామట్లు సమస్తావయవ పూజలంది బహుసుందరముగ గన్పట్టుచు భక్తుల నెక్కువగ ఆకర్షించును. కాననే పూజా కల్పములలో "అథాంగపూజా" అని ప్రత్యవయవమునకు వేరు వేరు జాతుల పుష్పములతో వివిధావయవ వర్ణనావిశేషముతో దాని అంత రార్థము నిమిడ్చి నామములు కూర్పబడియున్నవి

---

# అర్చనతీర్థము

పృథ్వికి (గంధము) పరిమళము గుణము, గంధము కష్ట సహిష్ణుతాసూచన. పృథ్వీగుణమగు పరిమళయుక్తమయిన గంధార్పణ ఒక ఉపచారము. పృథ్వియేమండపము. వస్త్రాభ రణ తులస్యాదులు పృథ్వీసంబంధోపచారములే. జలములు,

షడ్రసోపేతద్రవ్యములు, రసగుణ ప్రధానమగు జలసంబంధోప
చారములు దీపనీరాజనోపచారములు రూపతత్త్వనిష్టమగు
తేజస్సంబంధోపచారములే ఛత్రచామరసేవలు, ధూపోప
చారములు స్పర్శగుణప్రధానమగు వాయుసంబంధోపచార
ములు. (దీనివలన సాధకుని వాసన లడంగును) శబ్దమాకాశ
గుణము. వాద్య విశేషములు, స్తోత్రములు, నృత్తగీతసేవలు
ఆకాశ సంబంధోపచారములు ఇట్లు మనము చేయుపూజ
యంతయు పంచభూతములు పంచతన్మాత్రలతో కూడినదే.
సృష్టిసంబంధమైనదే. ఇట్టి ద్రవ్యార్పణచే పూజాద్రవ్యాంత
ర్గత సృష్టిరూప విరాట్ తత్త్వమునకును, ప్రతిమాంతర్గత ప్రతి
బింబాత్మక పరమాత్మతత్త్వమునకును, పూజకుని హృద
యాంతర్గత జీవాత్మతత్త్వమునకును ఐక్యానుసంధానము చేసి
నట్లయినది. ఏలనన.

శ్రు॥ బ్రహ్మార్పణం, బ్రహ్మహవి, ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా
హుతమ్"॥ అను వేదమంత్రము ప్రకారము పరబ్రహ్మ
కొరకు బ్రహ్మస్వరూప పూజాద్రవ్యములను బ్రహ్మాగ్ని యనద
గిన బ్రహ్మస్వరూప ప్రతిమయందు బ్రహ్మస్వరూపుడైన
సాధకు డర్పించినట్లయి అద్వైతసిద్ధియైనది.

ఇట్టి ఐక్యాను సంధాన పూజచే విశ్వమంతయు భగ
వంతునితో నిండినట్లర్థమయి విరాడ్రూపము దృశ్యమానమై
అదహంకారము నశించిపోగా పరమాత్మాను సంధానము
సిద్ధించును.

భగవద్గీతలో 6 అధ్యా. 29, 30 శ్లో॥ లలో చెప్పబడిన ఆత్మసంయమనయోగ మిదియే.

శ్లో॥ సర్వభూతస్థమాత్మానం। సర్వభూతాని చాత్మని।
ఈక్షతే యోగయుక్తాత్మా। సర్వత్ర సమదర్శనః॥

అనగా ఆత్మయోగి అంతటను ఆత్మదర్శనము చేయుచున్నాడు. తాను సర్వభూతములయందును, సర్వభూతములను తనయందును ఆత్మరూపముననున్న విధమును గ్రహించుచున్నాడు.

శ్లో॥ యోమాం పశ్యతి సర్వత్ర। సర్వంచ మయి పశ్యతి
తస్యాహం నప్రణశ్యామి। నచమే నప్రణశ్యతి॥ గీత॥

ఎవడు నన్ను సర్వభూతములయందును సర్వభూతములను నాయందును చూచుచున్నాడో వానికి నేను నిత్యుడను. వాడును నాకు నిత్యుడే. విశేషార్థము:- 'నప్రణశ్యామి' 'నప్రణశ్యతి' అనగా పరోక్షతను పొందను. పరోక్షతను పొందడు. అనగా అదర్శనమును పొందను అనగా ప్రత్యక్షమగుచునే యుందును. యోగక్షేమముల వహింతును. ఆతడెల్లపుడును నన్ను గాంచుచునేయుండును.నా రక్షణ నందును. మేమిద్దరము ఇట్లు ఒకేస్వరూపమగు చుమని తాత్పర్యము.

ఈ భగవద్గీతా శ్లోకములందు చెప్పబడిన విరాడ్రూప, ఆత్మస్వరూప అనుసంధాన యోగమునకు, న్యాసాది, ఉపచారాంతపూజ, క్రియాస్వరూపము. ప్రపంచము శివశక్త్యాత్మకముగా తెలిసికొని, శ్రీచక్రమును శివశక్తి సంపుటముగా

తెలిసికొని బ్రహ్మాండ సంజ్ఞగా నెంచి శ్రీచక్రము నర్చించి, దేహమందుగల యోగచక్రములతో శ్రీచక్రము నన్వయించుకొని, యోగాభ్యాసము చేయుచు, కుండలినీశక్తిని ప్రయోగింపజేయుచు ఆయా చక్రములందుగల యాకినీ, రాకినీ, లాకినీ, కాకినీ, డాకినీశక్తులకు పరివారసహితముగా నాంతరంగికార్చన చేయుచు రుద్ర విష్ణు బ్రహ్మగ్రంథులను భేదించుకొని సహస్రారకమలమునకు గొంపోయి, నాదబిందు కళాతత్త్వముల గుర్తించి వాని కతీతమైన పరతత్త్వమునం దానందించుటయే సమయాచార రహస్యము. ఈ యాచార సాధనలో దేహ, దేవాలయ, బ్రహ్మాండ, శ్రీచక్ర, మంత్ర, గురుకాలముల కభేదము సాధించుట ధ్యేయమైయున్నది.

అహా! ఎంతటి తత్త్వమయము, భావనాసంపూర్ణమును అయిన పూజ హిందువులది! కావుననే

శ్లో॥ అర్చకస్య తపోయోగా। దర్చనస్యాతి శాయనాత్ ।
ఆభిరూప్యాచ్చ బింబానాం। దేవస్సాన్నిధ్య మిచ్ఛతి ॥

అని ఆగమశాస్త్రములు చెప్పుచున్నవి. అనగా అర్చకుడు చేయు ఏకాగ్రమనస్సుతోడి తపస్సు, మఱియు పూజలవలనను, అర్చనావిశేషముల బాహుళ్యమువలనను, విగ్రహము తీర్చబడిన ధ్యానానుకూల స్వరూపమువలనను దేవతాశక్తులా విగ్రహమున నతిశయించి యాశ్రయించియుండునని యర్థము. దీనినే మనవారు స్థల, శిలాభోగములందురు. అట్లు

గానిచో అన్ని దేవాలయములు ఒకే స్థాయిలో నుండియుండును. కొన్నిటి కాధిక్యము ఈ కారణముననే కలిగినది.

---

# హిందువులది ఏకేశ్వరోపాసనయే

పూజలో మనము చేయు ప్రథమోపచారము ధ్యానము. ఏ మూర్తి ధ్యానమైనను అందు అఖండ సచ్చిదానంద పరబ్రహ్మ లక్షింపబడియుండును. రెండవ యుపచారమావాహనము. దేవాలయములలోని ప్రతిమాపూజ కావాహనమును, ఉద్వాసనయు ఉండవు. అచ్చట శాశ్వతముగా నా భగవంతుడు నిల్చునట్లు మొదటనే స్థాపనలోనే కర్మలాచరింపబడియుండెను. ఇతరతాత్రి పూజలో ప్రతిమలోనికా ధ్యానమూర్తి వచ్చి నిలుచుట(వ్యక్తమగుట) కావాహనమది. అతడట్లు వ్యక్తమైనట్లును లేక ఆ మూర్తియందు విశ్వమయుడగు నా పరమాత్మ యుండుటను మనము గుర్తించినట్లును ఈ యుపచారముచే నిశ్చయించుకొనిన పిదపనే ఇతరోపచారము లారంభమగును. కావుననే ఇది యుపాసనమైనది. ఇది పరబ్రహ్మోపాసనయే గాని బొమ్మలపూజ కాదు. అనేక విగ్రహములున్నను ఎవరి కేది యభీష్టదేవతయో ఆ యభీష్ట ప్రతిమనే పరమాత్మ స్వరూపముగా భావించి పూజింతురు. ఇతర ప్రతిమా పూజ వారు చేసినను ఏకకాలమున భిన్న దేవతా

తత్త్వముల నుపాసింపరు. కాన ఇది పరమాత్మ భావనయే. పరమాత్మోపాసనయే. ప్రతి యుపచారమంత్రములోను ఆ పరమాత్మ భావనయు ఆతనివలన సృష్టియైన వానిలోని పవిత్ర వస్తువు లాతనికే సమర్పించి ఆతని ప్రసాదములుగా వానిని స్వీకరించుటయు ఇమిడియున్నవి. కాన హిందువు లేకేశ్వరోపాసకులే యగుదురు.

---

# ప్రసాదము

ఈశ్వర పాదములకడ బెట్టిన పదార్థము ప్రసాదమగును. నారికేళమునకు నారికేళత్వము నశించును. అన్నమున కన్నత్వము పోవును. స్థూలమైన నారికేళాదులు సూక్ష్మమైన ప్రసాదముగా, పరమేశ్వరుని దయగా బరిణమించును. ఆదయాస్వరూపమే ప్రసాదరూపమున మన కందుచున్నది. లేనిచో నా యల్పద్రవ్యకణమున కాసించి చేజాచుదుమా? ఇచ్చినది పుచ్చుకొందుమా? పుత్రులకు దేహాదు లొసంగువాడు జనకుడు. తండ్రి సంపాదనలో నొక ఫలమును చేకొని బిడ్డడు మరల తండ్రికే ఇచ్చినపు డాతండ్రి బిడ్డనుజూచి అమితానందమంది వానినే తినుమని ఇచ్చివేయుటలేదా? భగవత్ప్రసాదమట్టిదికాదా? భగవంతుని కర్పింపకుండ నాతనిచే సృష్టింపబడిన వస్తువును గొనుట దొంగతనమే యగునని భగవద్గీత బోధించుచున్నది.

కార్యము లాతడు నెఱవేర్చుచు అనంత నామరూపముల దాల్చుచున్నాడు. లోకుల యభిరుచి ఏ గుణ రూప నామ కార్యములందు గలదో అందుకు తగిన స్వరూప ప్రతిమలో ఆ గుణ, కార్య ధురంధరత్వ సంపూర్ణత్వము నాశ్రయించి తన పని నెఱవేర్చుకొనుటలో తప్పున్నదా? అంతమాత్రముచే నా భగవంతుని కనేకత్వము పట్టినదా? అట్లే కానియెడల ఒకే ప్రభుత్వమున కిన్ని డిపార్టుమెంటులు, అధికారులు, ఎందులకు?

కాన పరమాత్మ త్రిమూర్తి స్వరూపములుగాను వీరి కతీతుడగు నిర్గుణుడుగనుకూడ ఉన్నాడని తేలుచున్నది. ప్రతి మూర్తిలోను పరబ్రహ్మ తత్త్వమును, ఆతని యనంత శక్తులలో నీ విగ్రహమునం దావిర్భవింపజేసిన ప్రత్యేక గుణ విశేష తత్త్వమును, విరాడ్రూప తత్త్వమును, ఈ విగ్రహ ప్రత్యేకాంశ కుపాంగములును సాక్షాత్కరించియుండును. ఆ విగ్రహ ప్రత్యేకతత్త్వము కామ్యసిద్ధికొరకు కర్చింపబడును. అందలి యుపాంగము లందుకు దోహదము చేయును. అందలి విరాడ్రూప పరతత్త్వములు జ్ఞాన ముక్తులకొరకు కుపాసింపబడును. ఆతత్త్వము లావిగ్రహమునందు మంత్ర, యంత్ర, తంత్ర విధ్యుక్త కర్మలచే నిక్షేపింపబడి వ్యక్తమై ఆ విగ్రహము సమస్త దేవతాత్మకముగాకూడ పనిచేయును. కావుననే ఏ విగ్రహ దేవతా ధ్యాన, నామావళులైనను అందా దేవత సర్వదేవతాత్మకుడుగను, పరబ్రహ్మమూర్తిగను, సృష్టిస్థితి లయకారుడుగను, ప్రత్యేక దేవతగను వర్ణింపబడియుం

దును. ఆకారణముననే ఆమూర్తికి చెందిన కల్పోక్తప్రికా రముగానేగాక, పురుషసూక్త లేక శ్రీసూక్తవిధానముగా కూడ జోడించి ఉపచారములు చేయుట సాంప్రదాయమై యున్నది. య, ర, ల, వ, హ లు పంచభూత బీజాక్షరములు. 'శ' సర్వదేవతాతత్త్వ బీజము వీనితో సంపుటీచేసి గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్య ఆచమనీయోపచారము లొక్కొక్కదానిచే క్రమముగా చేయుదురు. 'య ర ల వ హ' లచే ఆవిగ్రహామందుపాంగములకును 'శ' చే ఇతర సర్వ దేవతలకును వీని యన్నిటిచేతను ప్రధాన తత్త్వ దేవతకును చేయుదురు. అనగా ఈ మూర్తి కొన్ని యుపాంగదేవతలతో కలసి పరమేశ్వరతత్త్వము, పూర్ణతత్త్వములతో ప్రతి ష్ఠింపబడి పనిచేయుచున్నాడని యర్థము. సృష్టి స్థితి లయ కర్తయుకూడ నాతడేయగును. ఈవిషయము చతుర్థగ్రంథ మున వివరించబడును.

---

# పరివార దేవతాతత్త్వము

ఒక భక్తునియొక్క కొన్ని కోరికలు తీర్చుటకు భగవం తుని కొన్ని శక్తుల కలయిక అవసరమైయుండును. అందొకటి ప్రాధాన్యత వహించును. ఆ ప్రధానశక్తిని ముఖ్యదేవతగాను, తక్కినవానిని అధిదేవతా ప్రత్యధిదేవతలుగాను, లేక, పరి

వార దేవతలుగాను, లేక, సాంగ సాయుధ సశక్తి పత్నీ పుత్ర పరివారముగాను పూజింతురు. దేవతల ఆయుధములు అహంకారాది దుష్ట శత్రుహార సూచకములుగాను, విద్యా మోక్ష ప్రద సూచకములుగాను ఉన్నవి. ఏ దేవత కే యాయుధము లుంచబడినవో ఆ దేవతోపాసనవలన నాతని యాయుధములు సూచించు ఫలములు కలుగుచుండును.

---

## పంచాయతన తత్త్వము

"ఆదిత్య మంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరం" సూర్యుడు, అంబిక, విష్ణువు, గణనాథుడు, ఈశ్వరుడు అను ఐదు ప్రధాన తత్త్వములుగా హిందూ విగ్రహారాధన వర్గీకరించబడియున్నది. సృష్టికి కారణము పృథివ్యాప స్తేజో వాయురాకాశములనెడి పంచభూతములును, వాని గుణములగు శబ్ద స్పర్శ రూప రస గంధములనెడు పంచతన్మాత్రలును త్వక్ చక్షు శ్రోత్ర జిహ్వాఘ్రాణములనెడు జ్ఞానేంద్రియములును, వాక్ పాణి పాద పాయూపస్థలనెడి పంచ కర్మేంద్రియములును, మనస్సును, మొత్తము 21 తత్త్వములును, పరమాత్మయు.

ఈ తత్త్వాధిదేవతలే ఆదిత్యాది పంచమూర్తులు. కాన సృష్టిక్రమము స్థితి లయ తత్త్వములు తెలిసికొని తత్తచ్ఛక్తుల

నుపాసించి తద్వారా పరబ్రహ్మమును దెలిసికొని జ్ఞానపూర్ణులై ముక్తినొందుట మన సాంప్రదాయము. ముందు తెలియబడునది సృష్టి స్థితి లయములు. వాని ఆధారముతో తల్లీనమైన విరాడ్రూపుని గుర్తించి తద్వారా పరమాత్మ తత్త్వమునెఱుంగు ప్రయత్నము. సోపానపంక్తివలె వడిదుడుకులులేని చక్కని రాజమార్గము. కాన సృష్ట్యాద్యాధార శక్త్యధి దేవతలగు ఆదిత్యుడు, అంబిక, విష్ణువు, గణనాథుడు, మహేశ్వరుల నందరిని ఉపాసింపవలెనని విధించి నిత్య షట్కర్మలలో ఈ దేవతార్చన నొక కర్మగా జేసిరి.

శ్లో॥ స్నానం సంధ్యా జపో హోమో
దేవతానాంచ పూజనం
ఆతిథ్యం వైశ్వదేవంచ
షట్కార్మాని దినే దినే (పరాశరస్మృతి 1-39)

శ్లో॥ నారాయణం మహాదేవం
ఆదిత్యం గణనాయకం
శక్తిం చైవాథ పంచైతా
న్నిత్యాం పూజయే ద్విజః

ఈ పంచాయతన దేవతలలో ఆదిత్య ప్రతీకముగా కావేరీనదిలో దొరకు స్ఫటికమును, అంబికకు స్వర్ణముఖీ నదిలో దొరకు పంచలోహశిలయు, విష్ణునికి గండకీనదిలో దొరకు సాలగ్రామములును, గణపతికి శోణానదిలో దొరకు

అరుణశిలయు, మహేశునికి నర్మదానదిలో దొరకు బాణలింగమును ప్రతీకములుగా నిర్ణయించబడినవి. అందు ఇష్టదేవతను మధ్యనుంచి తక్కినవానిని శాస్త్రోక్తవిధిగా నలుమూలలందుంచి ఆ దేవతకు నిర్ణీతమైన విధానముచేతనే తక్కినవానిని పూజించు టాచారమైయున్నది. దానివలనకూడ ఇది ఏకేశ్వరోపాసనయేయని ద్యోతకమగుచున్నది. ఈ పంచాయతన పూజలో ఆవాహానాది షోడశోపచారములు పురుషసూక్త విధానముగాను, స్నానము నా మంత్రముతోను వెంటనే పురుషసూక్త, శ్రీసూక్త, మన్యుసూక్త, నమక, చమక, పంచామృత, ఫలోదక, శుద్ధోదక మంత్రములచే చేయవలెను. సూక్తములను యథాశక్తిగా పఠించవలెను శంఖతీర్థము శిరస్సున జల్లుకొని సాలగ్రామ శిలావారిని మంత్రముచే శరీరశుద్ధి పాపక్షయ, మోక్షములకొఱకు ముమ్మారు లోనికి పుచ్చుకొనవలెను. (ఉద్ధరిణెతో.) ఇది పంచదేవతాపూజయైనను ఏకేశ్వరోపాసనయేయని శాస్త్రము చెప్పుచున్నది :-

"ఉపాసనం పంచవిధం బ్రహ్మోపాసనమేవ తత్"

ఒకే పరమాత్మయొక్క పంచశక్తులను సృష్టితత్త్వము తెలిసికొని తద్వారా పరమాత్మ జ్ఞానము సంపాదించి మోక్షమందుటకుగాను ఉపాసింతురు. అట్టి దేవాలయములనుకూడ నిర్మించిరి. ఇంతకన్న పరమాత్మ శక్తిని, పరమాత్మని తెలియదగిన సులభోపాయము లేదు. కాన ఇది ఏకేశ్వరోపాసనయే గాని బహుదేవతోపాసన కాదు.

## ముగింపు

ఇట్టి హిందూ తత్త్వోపాసన యేడ! "పరలోకమందున్న మా తండ్రీ (ఆత డీలోకమున లేడని భావమేమో.) మా నిత్యాహారమును మాకిమ్ము. (Give us our daily bread) అని ఏసుక్రీస్తుపేర మిక్కిలి వినయముతో వేడుకొనుచున్నాము మా తండ్రీ!" అని ప్రార్థించు మత ప్రార్థన యేడ! "అల్లా సర్వశక్తివంతుడు. అతని నమ్మనివారిని నఱకివేయుము" అను మతగ్రంథ వచన మేడ! విజ్ఞులు, తత్త్వజిజ్ఞాసువులు వీనిలో నుత్తమ తరణ సాధన నరసి చేపట్టుదురుగాక! ప్రపంచమున నేమతమునందైనను ప్రహ్లాదుని చరిత్రవంటి చరిత్ర బోధింపబడినదా! అద్వైతసిద్ధి నొక్క ఆర్షమతము తప్ప ఇతరమతము లేవైన నిర్వచింపగలిగినవా? అనుభవింపగలిగినవా? వారా మన మూర్త్యుపాసనను నిరసించుట. తత్త్వము తెలియక వారెట్లున్నను మన ... మన ఉత్తమోత్తమ దేవతార్చన చేయుచునే యుందుముగాక! జీవితము ధన్యము చేసికొని మోక్షసామ్రాజ్యమును చూరగొందుముగాక! ప్రపంచమున కభ్యుదయ మార్గమును హిందువులు చూపుదురుగాక!

గీ॥ చేతులారంగ శివుని బూజింపడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని
దయయు సత్యంబు లోనుగా దలపడేని
కలుగ నేటికి తల్లుల కడుపుచేటు. (పోతన.)

# మూర్త్యర్చనా తత్త్వము

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయేణ మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాః సమస్తాః సుఖినో భవంతు.
ఓం శాంతిః శాంతిః శాంతిః
తత్సత్ బ్రహ్మార్పణమస్తు.



సీ॥ దేవాలయము చుట్టు దీర్ఘంబు లుండుట
తీర్థముల్ జరుగుట దివ్యముగను
తీర్థములకు బహు తైర్థికుల్ వచ్చుట
వచ్చినవారి కవ్వారిగాఁగ
అన్నదానాదిక మవిరళంబుగ నౌట
అందుచే బుణ్యంబు లధిక మౌట
పుణ్యాధికత చేత భూమిపై నెందును
ధనధాన్యసంపద తనరుచుంట

గీ॥ ధనము ధాన్యము లిట్టు లత్యధిక మగుట
దేశము సుభిక్షమై దాన దీప్తి గనుట
దేవతలుఁ బుట్టఁ గోరు టీదేశ మందుఁ
దలఁపదేవాలయంబుల వలన నిజము.